# తరంగిణి

(ఖండకావ్య సంపుటి)

కందుకూరి

రామభద్రరావు






*

శ్రీ శివశంకర శాస్త్రి

ప్రవేశికతో

*

వెల పావలా

# తరంగిణి

(ఖండకావ్య సంపుటి)

*






కందుకూరి
రామభద్ర రావు

హృదయసంబంధి, ఉపదేశకాగ్రణి

శ్రీ పెద్దాడ రామస్వామి గారికి

భక్తి తాత్పర్యములతో

సమర్పితము

# ప్రవేశిక

రామభద్రరావుగారి కవిత్వంలో అకృత్రిమత్వం కనిపిస్తుంది. పద్యాలుగాని, పాటలుగాని ప్రయత్నం మీద రచనచేసినట్లు తోచదు. భావం కలగగానే అమాయికంగా ఖండిక నడిచినట్లు కవి భావిస్తాడు. గాఢపరిశ్రమచేసి కావ్యరచన అలవరచుకున్న ప్రౌఢోక్తిపరుల పద్ధతి ఇందులో లేదు. ప్రతి కావ్యమూ ప్రౌఢమార్గంలోనే నడవ నక్కరలేదు.

'తరంగిణి'లో ఏ భాగంలో చూసినా లాలిత్యం స్ఫురిస్తున్నది. పదాల్లోనూ, భావాల్లోనూ ఈ లలిత గుణం సహజంగానే గోచరిస్తున్నది. కవి సరళహృదయుడు కావడంచేత ఖండిక లన్నింటిలో కూడా సారళ్యం సంభృతంగా ఉంటున్నది.

ఇందులో వాడిన వృత్తాలుగాని, తేటగీతలుగాని, గేయాలుగాని సాఫీగా నడుస్తున్నవి. గేయరచన కష్టసాధ్యమైనదే కాని తాళజ్ఞానం ఉంటే కవి చాలా వరకు కృతార్థుడు కావచ్చు. 'తరంగిణి' గమనం శ్రావ్యంగానే ఉంది.

ఈకవి పూర్వం చేసిన ఖండ కావ్య సముచ్చయానికి 'లేమొగ్గ' అని పేరు పెట్టాడు. ఆగ్రంథ పీఠికను బట్టి దేశభక్తివల్ల ఈయనలో కవిత్వం అంకురించినట్టు తెలుస్తుంది. ఆకావ్య నామకరణాన్నిబట్టి కవి తనకవిత పరిణతస్థితికి రాలేదని తలచినట్టు విశదమవుతున్నది. 'లేమొగ్గ' కన్న 'తరంగిణి'లో కావ్యకళ ఎక్కువ పరిణతి పొందిం దని నిస్సంశయంగా చెప్పవచ్చు.

ఇందులో సంగ్రహించిన అనిబద్ధ కావ్యాలు అనేకం కాకపోయినా వస్తువులో వైవిధ్యం ఉన్నది. దీన్నిబట్టి కవి అనేకవిషయాలమీదికి దృష్టి పోని

చ్చినట్లు గోచరించక మానదు. గ్రంథాలు చదివి కవిత్వం చెప్పిన పద్ధతిని కాక ప్రకృతిని సూటిగా విలోకించడం వల్లగాని, అకృత్రిమమైన అనుభవాన్ని బట్టిగాని ఉద్భవమైన భావాలనే ఈయన పద్యాల్లోనూ, పాటల్లోనూ పొదిగినాడు.

చాలామందికి వక్రోక్తి మీదగాని ధ్వనిమీద గాని వ్యామోహం లేదు. దూరాన్వయాలు, అప్రసిద్ధపద ప్రయోగాలు, నిఘంటు శరణ శబ్దాలు లేకుండా ఝుడితిస్ఫూర్తి కలిగించే కావ్య పద్ధతే అస్మదాదులకు ఆమోదం ఇస్తుంది. సహృదయులకు రసాస్వాదనంలో శ్రమకలిగించే సరణి ఈయనలో లేదు.

ఈయన దేశభక్తి 'గోదావరి', 'గంగమ్మ' మొదలైన వాటిలో ప్రకృత్యారాధనపరంగా కన బడుతున్నది. "గంగేచ యమునే చైవ గోదావరి సరస్వతి" అని పూర్వులు స్మరించారు. 'జన్మభూమి'

'ఆంధ్రభూమి' ఇత్యాదులలో ప్రస్ఫుటంగానే దేశ భక్తి గోచరిస్తున్నది. ప్రేమవిషయంలో కవి గభీరంగా వెళ్లకపోయినా మృదువుగా భావాలను వర్ణించాడు. 'కోర్కె' 'విరహిణి' 'నాభాగ్యము' వీటిలో ఈవిషయం కనుక్కోవచ్చు. ఈయనలో భక్తికూడా కొంతవరకు కనబడుతున్నది. 'విశ్వకోశము' 'పూజ' 'జీవయాత్ర' 'కృష్ణమ్మ' దీనికి ఉదాహరణాలు. లోకం చూపేకాఠిన్యమూ, నిర్జీవ సంకేతాలకు చేసే అర్చనా, ఈకవికి అమర్ష కలిగించినవి.

ఆరితేరినకవులు సామాన్యంగా గ్రంథస్థం చేసే ప్రేమ, భక్తి, సంసారసమస్య, దేశారాధన, మొదలైన వన్నీ ఈకవికూడా కావ్యంలో అల్లినాడు.

ఒకవయస్సు వస్తేగాని, ఒకవిధమైన బాధ కలిగితేనేగాని కవిత్వం నిగ్గుతేలదు.

ఎన్నాళ్లు వేచినా
యింతే నాపాటరా;
ఏనాటికైన నీ
కింపౌనె నాగీతి ?

అని 'శ్రీమొగ్గ'లో కవి సంశయాపన్ను డైనాడు. అటువంటిసందేహంతో నిమిత్తం లేదు. ఈ "తరంగిణి" వెనకటి కావ్యంకన్న మంచిపాకంలో పడ్డది.

రామభద్రరావుగారి కావ్యకళ ముందు ముందు ఎక్కువపరిణతిపొందే సూచనలు ఇందులో స్ఫుటంగా కనబడుతున్నవి. నాకు అటువంటి విశ్వాసం ఉన్నది.

శివశంకర శాస్త్రి

విశాఖ పట్నం
డిసెంబరు ౧. ౧౯౩౫

## గోదావరి

ఆషాఢప్రథమాంబుదోద్గమన
వేళాప్రాప్తసౌభాగ్య సం
తోషమ్ముల్ తొలుకాడు పొంగు కని
యాదోనాథునిం గూర్మి నా
శ్లేషింపంగ ద్వరప్రయాణవయి
వీచీహస్తముల్ సాచి క్రొం
భూషల్ శీర్షమునందు వెల్గ జనుని
బూజింతు గోదావరీ.

తూరుపుకొండనెత్తముల
దోయజబంధుడు కూర్చు వింతసిం
గారము లూర్ము లందుకొనగా
ప్రవహించునదీలలామ! ఎం

తోరమణీయనృత్యమున
దూగినతోయములోన నేకళా
పారము నిల్చెనోమధుర
భావను లూరెడిమానసంబునన్.

కలుషశతంబుల న్గడిగి
గర్భమునం దడగించుకొంచు ని
ర్మల సలిలంబు పంకమగు
రట్టు భరించి యుదారతన్ పురం
ధ్రులు కరపంకజాతముల
దోసిళులన్ లిఖియించి, పూజలన్
సలుపగ నూర్మిహస్తములు
సాచెద వెంతటిపుణ్యశీలవో.

రాజనరేంద్రసామ్రాజ్య వైభవరమా
మకరతోరణరత్నమంటపంబు
వాగనుశాసనువాగ్వైభంబులో
గనటువో బోవుగంగాభవాని

కదనమ్ములో నగ్నికణములు గురిపించు
తెలుగువీరుని శౌర్యతీక్ష్ణగుణము
రత్నరాసులతో దరంగమ్ములం దూగు
నౌకాకనత్కేతనముల మెరపు
కనులతో గన్న భాగ్యశాలినివి తల్లి!
శోభ లెడలిన ఆంధ్రభూసుత పునఃప్ర
యత్నవాంఛారతికి హృదయమ్ము పొంగ
శ్రావ్యగళ మెత్తవమ్మ! ప్రస్థానగీతి.

పసుపుంబూతలు పైడినిగ్గు లొలయన్
బాలార్క తేజంబుతో
నొసటం దిద్దిన కుంకుమంబు వెలుగఁ
నూత్నారుణస్నాతలై
కొన ముత్యంబులపోల్కి నంబుకణముల్
కొంగుల్ వెలార్పంగ సా
రసహస్తంబుల హారతుల్ నిలిపి
రార్యల్ నీకిదే మాతరో!

## గంగమ్మ

పొంగుతూ వచ్చిందిరా
గంగమ్మ
రంగుతో మెరసిందిరా

తరగచేతులపైని
నురగసొమ్ములు వెల్గ
ఆటలే ఆడిందిరా
మధురముగ
పాటలే పాడిందిరా ...పొంగుతూ.

కనులపండువు సేయు
కలమకంబళముపై
పగలబడి నవ్విందిరా
తొలిసంజ
పసిడిలోదొరలిందిరా ...పొంగుతూ.

నువ్వుపువ్వులచెలువు
నవ్వుతో గలియంగ
పూలన్ని కోసిందిరా
వగలతో
చేలన్ని తిరిగిందిరా ...పొంగుతూ.

అత్తింటి కని పోవు
ఆడుపడుచును బోలి
పసుపుకుంకుమ లందెరా
సిగ్గుతో
మిసిమినవ్వులు నవ్వేరా...పొంగుతూ.

పడుచుప్రాయపుపొంగు
పట్టలే కెదలోన
పరువెత్తి పోయిందిరా
జలధితో
ప్రణయైక్య మందిందిరా ...పొంగుతూ.

## జ న్మ భూ మి

జన్మభూమీ నీదు
సాంగత్యసౌఖ్యమ్ము
వదలివేసితి నమ్మ
ఉదరపోషణకు

ఒకసారి మెలమావి
నూగుజొంపాలలో
ఉద్రిక్తపికకన్య
నుడికించి పాడింతు

ఒకసారి బంగార
మొలికించు వరిచేల
పిచుకదంపతులతో
వినుచుందు ప్రణయాఖ్య

కలుపుచేలో మాల
కన్నె కట్టినపదము
వినుచుందు నొకసారి
వనలక్ష్మితో గూడ
ఒకసారి గౌతమీ
సికతాతలమ్ములో
పిల్లతరగలకధలు
ఉల్ల మలరగ విందు
శాంతజలమును కాన
చందాలు దిద్దుకొను
ఒయ్యారిమలిసంజ
నొకసారి తిలకింతు
ఎంచుకొన్న కొలంది
ఏదో కలతను జెంది
మన సౌక్యరీతిగా
మరగిపోయెడి నమ్మ !

"ఆంధ్రభూమి"

శ్రీముఖాబ్దము
సిరుల కిరవై
చిన్నినగవులు
చిలకరించెడి
ఆంధ్ర తేజము వెల్లివిరియగ
"ఆంధ్రభూమి" నలంకరింపర

క్రొత్తచివురులు రేకు లెత్తగ
క్రొత్తసుమముల చెలువు లొలయగ
క్రొత్తతావులు దిశల బర్వగ
క్రొత్తపాటలు కోకిలాంగన
కుత్తుకను సవరించి పాడగ
క్రొత్తతలపులు కొనలు సాచగ

తరలి రశ్మిక దీక్షితుడవై
జయము నీ కగు జయము నీ కగు
జయము నీ కగు ఆంధ్ర పుత్రుడ
శ్రీముఖాబ్దము
చెలువుకొలువై
శీర్షమున నా
శీస్సు లుంపగ
ఆంధ్ర తేజము వెల్లివిరియగ
ఆంధ్రభూమి నలంకరింపర

(ఆంధ్రభూమి తొలిసంచికకు)

## పా ట

పాడవే ఓచెల్లి
పాడవే పాట
మర్త్యలోకము నా
కమర్త్యమై పోయింది

పైరగాలికి జారు
పైట తరగెత్తింది
ఒయ్యారినడకలో
ఉయ్యాల లూగింది పాడవే.

చీకుచింతలు లేని
చిత్త ముప్పొంగింది
కనుదమ్మిజంటలో
మినుకులై మెరసింది పాడవే.

సన్నన్ని నీమొల్గు
కిన్నెరై మ్రోగింది
ఒదుగుల్లు ఒదుగుతూ
ఉబికుబికి మొగసింది — పాడవే.

చదలపై జాబిల్లి
చలవచేతులతోన
చిలుకుసుధ కెక్కింది
ఎలుగులోపలితీపి — పాడవే

తురగలించెడి యేటి
తరగవిరుపులలోన
కిలకిలా నవ్వింది
కలకంఠ రావమ్ము — పాడవే.

పూదేనెవాకలో
పులకించునునుగాలి
పరిరంభసుఖములో
కరిగింది రాగమ్ము — పాడవే.

ఆశాంతములదాక
ఆర్ద్రమై లోకమ్ము
ఆనందగీతిలో
అవశమై పోయింది                    పాడవే.

## భ్రమ

నీదివ్యవిమలాంఘ్రి
నీరేజయుగళిపై
భ్రమరినై పాడంగ
భ్రమ పుట్టెనోయి

పద్మరాగ ప్రభలు
ప్రసవించు నచ్చోట
బ్రదుకు సుమాళించు
పరిమళం బచ్చోట నీ.

అవ్యక్తగానాంత
మానందతన్మయము
మాధుర్యభాగ్యమ్ము
మకరంద మచ్చోట నీ.

దివసావసానమున
తిమిరాన గనుమోడ్పు
నిజమాతృవక్షున
న్నిభసమాశ్రయ మద్ది	నీ.

## విశ్వకోశము

ఈవిశ్వకోశమ్ము
ఎదుట పెట్టితి వోయి
అర్థమ్ము గ్రహియింప
అలవి కా దోయి

భాష్యకారకు లెల్ల
పలుత్రోవ లైనారు
పదవిభాగమె తెలియ
బ్రహ్మాండ మోయి

పదిమందితో పాటు
కథ తెలిసినట్లుగా
కలకలా నవ్వెదను
కన్నీరు గార్చెదను

వేసాలయీా బ్రతుకు
ఈసడింపవ టోయి
అర్ధబోధము చేసి
ఆదరింపవ టోయి!

## కోర్కె

ఏముహూర్తమునందు
ఏకమైతిమో చెలీ
బ్రతుకంత మధువుగా
పయనించి పోదాము ఏము.

ఒకరికౌగిట నొకరు
రకరకములై కరగి
ప్రాయ మొకవాకగా
ప్రవహించి పోదాము ఏము.

చిరునగవుతళుకులో
చిరుపాటవలపులో
వాగువాగును దాటి
పరువెత్తి పోదాము ఏము.

కన్నీటిధారలే
కలిసి కలతను రేప
కల్లోలినీజీవ
కాంతులే కందాము ఏము
గాంభీర్యశాంతాలు
గట్లొరసి పారగా
పున్నెములు పండించి
మన్ననలు దూతాము ఏము.
కలకాల మీాకీతి
వెలి లేక ప్రవహించి
కడలేనికడలిలో
కలియంగ పోదాము ఏము.
ఆకడలిగర్భాన
ఆనందజ్యోతితో
ఆనందగీతితో
ఆనందమూర్తితో
ఐక్యమై పోదాము ఏము.

## సాయాహ్నవర్షము

నిజసహస్రమయూఖాలి నేల నేలి
చండకిరణు డటన్న యశంబు గన్న
ద్యుమణి చరమాద్రిపైని దా నొరిగిపోవ
జగతి కంతకు శోభలు సన్నగిల్లె

తనప్రకాశమ్ము కంత కాధారమైన
రవిని గోల్పడ్డనింగిగర్భాన నడగి
యున్నదుఃఖాగ్ని తామ్రమై యుబికె వెలికి
నివురుసందుల గన్పట్టు నిప్పువోలె.

తమవిలాసాల కెల్ల నుత్సాహమిచ్చు
అర్కు డస్తాద్రితలమున నస్తమింప
పక్షముల నొక్కపెట్టున బాదుకొనుచు
పక్షిగము లార్చె బాంధవప్రతతివోలె.

జగతి గార్కొన్న గాఢవిషాద మంత
క్రమ్ముకొనె నాగ నేతెంచె కారుమొగిలు
పట్టలే కొక్కమొగి నింగి బావు రనగ
దుఃఖధారల పుడమెల్ల దూట్లువడియె.

## పూజ

అన్యవ్యాసంగచిత్తుడ నగుట రేయి
జాముప్రొద్దెక్కుదాక త్వచ్చరణసేవ
మరచి నిద్రించినానమ్మ! మాత! ఇపుడు
పూజసేయంగ బూలకై పోవువాడ

కంటకావృతము పథము; కాలినడక;
పలుకుదోడుగ దోడ నెవ్వరును రారు
అంతకంతకు దీక్ష్ణమౌ నాతపంబు
సఫలుడం గానొ యనుశంక సందడించు.

ప్రాతరారంభవేళ నవ్యప్రసూన
గుచ్ఛముల దెచ్చి మాలగా గూర్చి నీదు
కంఠసీమ కలంకారకలన నిడిన
ప్రతిభ గలవారిపరిహాసపాత్ర మగుదొ.

జ్ఞాతివైరము కలదు పూజారులందు
సహజసౌందర్యసౌరభ్యసంపదలకు
తావలములైన నవపుష్పదామములను
గూర్చినం గాని మెచ్చ రక్కుటిలమతులు.

కాలహరణమ్మ్మచే గాలు కదపలేక
కలచుభక్తిని విడువంగ దలపలేక
నడుమ నురియాడుచిత్తాన నవయుచుంటి
ఏనె సగమయి కృశియింతునేమొ తల్లి.

ఓహో! వెర్రినై కొరగానియూహసేతు
పరులపరిహాసవైరసంభావనలకు
కలగ నేటికి? నాకు సాక్షాత్కరించు
రమ్యమూర్తి యథేచ్ఛ నర్చనము సేతు.

## మాలతి

చల్లగా పారుసెలయేటివెల్లువలకు
కారుకొనివచ్చునవజీవకాంతితోడ
లాస్య మొనరించుమాలతీలతను దెచ్చి
పాతుకొన్నాడ మద్గృహప్రాంగణమున.

అందచందాలు మెలికగా నల్లుకొన్న
వింతపోకిళ్ళగుబురు లవిత్రి మూని
కృత్రిమాకృతిగా నుత్తరించి, మురిసి
పుడిసెడుదకంబు ప్రతిప్రొద్దు పోయుచుంటి.

పథికమార్గాన జెలరేగుపాదధూళి
శిరమునం దాల్చి, దినభర్తృభరముతోడ
బ్రదుకలేదోటు కృశియించి వ్రాలె; చెరను
కుమిలి కృశియించుదేశభక్తునివిధాన.

సవ్యనాగరకంపుచిహ్నాగ దలంచి
మానవప్రాణములు దీయుమనుజు లకట
అడవిలో బుట్టుతీవల నైనగాని
బ్రతుకగానీరు స్వేచ్ఛగా ప్రబలనీరు.

## సానుభూతి

పాపము బాల్యమందె యెడ
బాసితి భర్తృసుఖంబు బాల, సం
తాపప్రదగ్ధచిత్తకలనన్
గృశియించు గ్రమక్రమంబుగా
నేపు దొలంగి దేహలత
యేపగిదిన్ భరియింతు వింటికిన్
గాపరివై పరుల్ తృణముగా
నిరసించు మహోగ్రబాధలన్.

అంచెలు దాటె మోవిరుచి
ఆనన మల్లదె తెల్లబారె క్రొ
మ్మించు గ్రమించుచూడ్కి విర
మించెడి దొల్లిటిబెళ్కు చెక్కులన్
దించుకపోయె సౌష్ఠవము
తీవ్రపుటూరుపు గాడ్పు వేడిమిన్
గాంచనవర్ణదేహము వికాసము
దక్కె. చలించె బాలికా !

కనుల స్రవించు బాష్పముల
కాల్వలకున్ దుది యున్నదే నిశీ
థిని వెలిబుచ్చునూర్పు లవధిన్
గనునే యొకలిప్తమైన నీ
యనుదినతప్తమైనహృద
యాంతర మెందునె శాంతి, రిత్తజీ
వనభరమున్ వహించి శత
వర్షము లెట్టులిటుల్ చరింతువో.

పతిప్రేమామృతపాత్రి బోరగిల
సంప్రాప్తించె దుఃఖాగ్నిపూ
రితహాలాహలపాత్ర చేతి కకటా!
కేలుంబవల్ ద్రావ జీ
వితసౌభాగ్యవిలాససంతతులు
స్తంభీభూతమై జారె నీ
గతి జూడన్ హృదయంబు నీ రయి
తోలంకంజొచ్చె నేత్రద్వయిన్.

బంగరువంటి కాపురము
పాడయి, ఆర్తి గృశించి శల్యమై
అంగన లాడిపోయగ
గృహాంతరసీమ వసింపనీక, నిర్
భృంగవినీలకుంతలవిహీనగ
జేయగ బోటుమాట లా
డంగ శిలామయాత్ము లకటా!
యెటు ప్రొద్దులు వెళ్లబుచ్చెదో.

దైన్యము రూపు గాంచిన
విధంబున దోచెడినిన్ను గన్న సా
మాన్యహృదంతరాళమును
మండుకపోవగ ధర్మమూర్తు లే
మాన్యపథంబునైన గని
మాన్పక నీవెత క్రూరచిత్తులై
హైన్యముగా గణించి పరి
హాస మొనర్చుచు నుందు రక్కటా!
చివికినధర్మశాస్త్రశిల
జేరిచి చీలలు గొట్టి నిన్ను చి
త్రవిధకు బాలొనర్చి పరి
తాపము జెందక ఛాందసాగ్రిణుల్
ప్రవిమలమార్గ మందురు
లవమ్మును లేవొ త్రపాభిమానముల్
ఎవ రెటు లే మొనర్చిన
సహింతు చలింపక బాలికామణీ!

## జీవితయాత్ర

ఎచటికీయానమో
ఎందుకీయానమో
ఎటనుండీ యానమో
ఎరుగనో సామీ!

కులుకు చంద్రికలలో
కుసుమ సౌరభములో
సెలయేటి పాటలో
చెలియ చిరునవ్వులో ఎచటి.

జలద సంకులములో
జగ ములియుగర్జలో
కటికి చీకటులలో
కన్నీటి ధారలో ఎచటి.

పాషాణతలములో
భయద కాననములో
ఆయాసభరములో
అడలు స్వేదాంబులో ఎచటి.

## వి ర హి ణి

ఏమి తోచదె చెలీ
ఏడ నున్నాడో
కరుణించి ఒకసారి
కంటి కగపడడే!

తెలిమబ్బు తెర లెల్ల
తొలగించి చూచేటి
చందమామ మెరుగునో
జాడ లేమైన ఏమి.

కనురెప్ప వాల్చరే
కాంతురే రేయెల్ల
ఉడులు కన్నా రేమొ
ఊహింప వమ్మా ఏమి.

దేశదేశా లంట
దివ్యసౌధా లంటి
తిరిగేటి గాడ్పు కే
తెలియునో వార్త ఏమి.

చిరుత వెన్నెలలోన
చిరునవ్వుతో నేమొ
చెబుతున్న దీయేరు
చెవియొగ్గి వినవే ఏమి.

చూడవే! ఓ చెలీ!
చూడవే! వనలక్ష్మి
తల యూచుచున్నదే
పలుకంగ లేక ఏమి.

కాంతుడే కనపడని
కాంత కే మున్నదే
అడివి గాసినవెన్నె
లానె నా బ్రతుకు ఏమి.

## నా భా గ్య ము

నానాథు డేనాడు
నను వీడిపో డమ్మ
న న్నంటి యుంటాడు
నాభాగ్య మేమొ !

ఏను మరచిన గాని
ఏమరచి పోడమ్మ
కనురెప్పవోలె న
న్గాచుకొని యుంటాడు. నానాథు.

వలపు హృదయములోన
నిలుపుకొ మ్మంటాడు
కడముట్ట యాత్రింత
కలియుదా మంటాడు నానాథు.

అడివిదారులవెంట
అడలవద్దంటాడు
కటికిచీకటివెంట
కౌముదే నంటాడు నానాథు.

సత్యదీపిక జూచి
జరిగి రమ్మంటాడు
మీాదిభారం బంత
నాదె పొమ్మంటాడు నానాథు.

ఇంతవలపులభర్త
కాంత కున్న ట్లైన
స్వర్గ మనగా వేరె
జగతిలో కలదె? నానాథు.

# కృష్ణమ్మ

నా చిన్ని కృష్ణమ్మ
నడిపించు ముచ్చట్లు
లోకమ్ము మరపించు
నాకమ్ము తలపించు

ఎత్తుకొన కృష్ణమ్మ
ఎలనగవు నవ్వెనా
పడిన ముత్యాలతో
ఒడియంత నిండించు     నా చిన్ని.

అలక చాలులలోన
ఒలుకు నీలా లెల్ల
దరహాసచంద్రికల
తళతళన మెరపించు     నా చిన్ని.

చిరుగజ్జె మ్రోయంగ
చిరుబొజ్జ కదలంగ
నటియింప కృష్ణమ్మ
నటియించు జగ మెల్ల నాచిన్ని.

ఒయ్యార మొలయంగ
ఊదెనా వేణువును
పదునాల్గుభువనాలు
పాటలో పులకించు నాచిన్ని.

## అన్వేషణ

వెదకుచున్నా రోయి!
వెదకుచున్నా రోయి!
ఆశతో కై లెత్తి
ఆలయములో నన్ను !

మంటపోపాంతాన
ఘంటాస్వనమ్ములో
వినరోయి! వినరోయి
"వృథ" యన్న నాదమ్ము.

పూజార్పణము లన్ని
పూజారిపా లోయి!
నైవేద్యఫల మంత
నామాలపాలోయి !

మణిగణాంచిత హేమ
మండనోజ్జ్వలశిలా
కల్పనములో నన్ను
కనరోయి! కనరోయి!

జీర్ణవస్త్రమ్ముల్లో
శిథిలాంగు హృదయాన
సోపానపంక్తిలో
శోషిల్లుకంఠాన
నామూర్తి కనరోయి?
నాపిల్పు వినరోయి?

వెదకుచున్నారోయి!
వెదకుచున్నారోయి!
ఆశతో కేలెత్తి
ఆలయములో నన్ను.

ఆదరముతో ఈ "తరంగిణికి"
ప్రవేశిక నిచ్చిన
నవనీతహృదయుడు,
నవీనాంధ్ర సాహిత్యాచార్యుడు
శ్రీ శివశంకర శాస్త్రి గారికి
కృతజ్ఞుడను

# లేమొగ్గ

(ఖండకావ్య సంపుటి)

కందుకూరి

రామభద్రరావు

ఇన్నీసుపేట

రాజమహేంద్రవరము

వెల పావలా

కాకినాడ :—పట్టమట్ట శేషగిరిరావుగారి జార్జిప్రెస్సునందు ముద్రించి, కందుకూరి రామభద్రరావుగారిచే ప్రకటితము. (500)